మ. పఠసి-పఠథః-పఠథ అపఠః-అపఠతమ్-అపఠత పఠిష్యసి-పఠిష్యథః-పఠిష్యథ

ఉ. పఠామి-పఠావః-పఠామః అపఠమ్-అపఠావ-అపఠామ, పఠిష్యామి-పఠిష్యావః-పఠిష్యామః

ఏవమ్

భవతి-భవతః-భవన్తి అభవత్-అభవతామ్-అభవన్ భవిష్యతి-భవిష్యతః భవిష్యన్తి

వదతి-వదతః-వదన్తి అవదత్-అవదతామ్-అవదన్ వదిష్యతి-వదిష్యతః వదిష్యన్తి

లిఖతి లిఖతః లిఖన్తి అలిఖత్ అలిఖతామ్ అలిఖన్, లేఖిష్యతి లేఖిష్యతః లేఖిష్యన్తి

పశ్యతి-పశ్యతః-పశ్యన్తి అపశ్యత్-అపశ్యతామ్-అపశ్యన్ ద్రక్ష్యతి-ద్రక్ష్యతః-ద్రక్ష్యన్తి

## భాషవ్యక్తాయాంవాచి ఆత్మనేపదీధాతుః

లట్ లఙ్ ల్రుట్

భాషతే-భాషేతే-భాషన్తే అభాషత-అభాషేతామ్-అభాషన్త భాషిష్యతే-భాషిష్యేతే-భాషిష్యన్తే

భాషసే-భాషేథే-భాషధ్వే అభాషథాః-అభాషేథామ్-అభాషధ్వమ్ భాషిష్యసే-భాషిష్యేథే-భాషిష్యధ్వే

అభాషే-అభాషావహి-అభాషామహి

భాషే-భాషావహే-భాషామహే భాషిష్యే-భాషిష్యావహే-భాషిష్యామహే

ఏవమ్

వన్దతే-వన్దేతే-వన్దన్తే అవన్దత-అవన్దేతామ్-అవన్దన్త వన్దిష్యతే-వన్దిష్యేతే వన్దిష్యన్తే

సేవతే అసేవత సేవిష్యతే

మోదతే అమోదత మోదిష్యతే

## భూధాతుః

| విధ్యాలిఙ్ | | | ఆశిషిలిఙ్ | | |
|---|---|---|---|---|---|
| ఏ. | ద్వి. | బ. | ఏ. | ద్వి. | బ. |
| ప్ర. భవేత్ | భవేతామ్ | భవేయుః | భూయాత్ | భూయాస్తామ్ | భూయాసుః |
| మ. భవేః | భవేతమ్ | భవేత | భూయాః | భూయాస్తమ్ | భూయాస్త |
| ఉ. భవేయమ్ | భవేవ | భవేమ | భూయాసమ్ | భూయాస్వ | భూయాస్మ |

### విధ్యాశిషోః లోట్

| | | | |
|---|---|---|---|
| ప్ర. | భవతు, భవతాత్ | భవతామ్ | భవన్తు |
| మ. | భవ, భవతాత్ | భవతమ్ | భవత |
| ఉ. | భవాని | భవావ | భవామ. |

### క్రియాతిపత్తౌ ల్ఱఙ్

| | | |
|---|---|---|
| అభవిష్యత్ | అభవిష్యతామ్ | అభవిష్యన్ |
| అభవిష్యః | అభవిష్యతమ్ | అభవిష్యత |
| అభవిష్యమ్ | అభవిష్యావ | అభవిష్యామ |

### భూతే లుఙ్

| | | |
|---|---|---|
| అభూత్ | అభూతామ్ | అభూవన్ |
| అభూః | అభూతమ్ | అభూత |
| అభూవమ్ | అభూవ | అభూమ |

### భూతానద్యతనపరోక్షే లిట్

| | | |
|---|---|---|
| బభూవ | బభూవతుః | బభూవుః |
| బభూవిథ | బభూవథుః | బభూవ |
| బభూవ | బభూవివ | బభూవిమ |

## అనద్యతనభవిష్యతి లుట్

| | | |
|---|---|---|
| భవితా | భవితారౌ | భవితారః |
| భవితాసి | భవితాస్థః | భవితాస్థ |
| భవితాస్మి | భవితాస్వః | భవితాస్మః |

## అస - భువి

| లట్ | భూతకాలః లఙ్ | విధి లిఙ్ |
|---|---|---|
| అస్తి - స్తః - సన్తి | ఆసీత్ - ఆస్తామ్ - ఆసన్ | స్యాత్ - స్యాతామ్ - స్యుః |
| అసి - స్థః - స్థ | ఆసీః - ఆస్తమ్ - ఆస్త | స్యాః - స్యాతమ్ - స్యాత |
| అస్మి - స్వః - స్మః | ఆసమ్ - ఆస్వ - ఆస్మ | స్యామ్ - స్యావ - స్యామ |

## విధ్యాశిషోః లోట్

అస్తు / స్తాత్ } స్తామ్ - సన్తు

ఏధి / స్తాత్ } స్తమ్ - స్త

అసాని అసావ - అసామ

ఈ విధముగా ఇతరధాతువులందును అన్ని లకారములందును తిఙ్ప్రత్యయములను చేర్చుకొనవలయును.

ధాతువులు మారినను (తిఙ్)ప్రత్యయములు మారవు.

సర్వలకారములకును తిఙ్ ప్రత్యయములు ఆదేశముగా వచ్చుటచే ఈక్రియాపదరూపములన్నియు తిఙన్తపదములగుచున్నవి.

పరస్మైపదిధాతువులకు పరస్మైపదప్రత్యయములనే చేర్చవలయును.

ఆత్మనేపది ధాతువులకు ఆత్మనేపదప్రత్యయములనే చేర్చవలయును. అను విషయము మఱువరాదు.

ఉభయపది ధాతువులకు ఈ రెండు విధములగు ప్రత్యయము లను చేర్చవచ్చును.

## వాక్యము

వర్ణములచే పదము, పదములచే వాక్యము ఏర్పడును. వాక్యము స్వతంత్రము అర్థావబోధకము, వ్యవహారాఙ్గమునై యున్నది. వాక్యముద్వారా భాష నేర్వవలయును; నేర్పవల యును అని విజ్ఞజనాభిప్రాయము. వాక్యమునకు పదములు అవయవములు. సంస్కృతభాషా శిక్షణమునకు వాక్యము ప్రధానము.

## వాక్యనిర్వచనము

'తిఙ్సుబన్తచయో వాక్యమ్' అని ఒక నిర్వచనము.

సుబన్తతిఙన్తపదసముదాయము వాక్యమగును. సాధారణ ముగా ఒకవాక్యమున ఒకతిఙన్తపదముండును. సుబన్తపద ములు ఎన్ని యేనియు ఉండవచ్చును. ఎన్ని సుబన్తపదములుం డినను తిఙన్తపదములేనిదే వాక్యము పూర్తి కాదు. వాక్య మున తిఙన్తపదము క్రియను బోధించును. కనుక దీనికి క్రియా పదము అని కూడ వ్యవహారముకలదు. క్రియ అనగా పని. ఏపనియైనను అది చేయువాడు లేనిదే జరుగదు. పనిచేయు వాడు కర్త అని పిలువబడును. కర్త సుబన్తపదముచేత బోధింపబడును. ఈ తీరుగా వాక్యమున కనీసము రెండుపదము లుండును. ఒకటి కర్తృపదము, రెండవది క్రియాపదము.

ఉ.- 1) ఈశ్వరః అస్తి = దేవుడు (భగవంతుడు) ఉన్నాడు.

సూర్యః ప్రకాశతే = సూర్యుడు ప్రకాశించుచున్నాడు.

2) క్రియ సకర్మకమైనచో వాక్యమున కర్మపదమును గూడ ప్రయోగించవలయును.

ఉ:- 1) బాలః గణేశం నమతి = బాలుడు వినాయకుని నమస్కరించుచున్నాడు.

2) కృష్ణః సత్యం వదతి = కృష్ణుడు సత్యమును పలుకుచున్నాడు.

## కారకపరిచయము

'క్రియాకారకాన్వితా' అని వాక్యమునకు మఱియొక నిర్వచనము. కొన్ని సుబన్తపదములు ఒకతిఙన్తపదము చేరినంత మాత్రమున వాక్యము కానేరదు. ఆ పదముల అర్థములకు క్రియాకారక భావముతో అన్వయము ఉండవలయును. అని దీని భావము. ఈ నిర్వచనమున కారకము అన నేమో వివరింపవలసియున్నది.

## కారకము

క్రియతో నన్వయించునది కారకము. లేదా క్రియాజనకము కారకము. ఒకపని జరుగుటకు అనేక కారణములుండును. అవి యన్నియు కారకములు అని పిలువబడును.

కారకములు ఆఱు, కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము అని వాని విశేషనామములై యున్నవి. సాధారణముగా నా కారకములకు వచ్చు విభక్తులను ఉదాహరణములతో క్రింద చూపుచున్నాము.

| కారకము | విభక్తి | ఉదాహరణ |
| --- | --- | --- |
| కర్త - | ప్రథమ - రామః విరాజతే = రాముడు ప్రకాశించుచున్నాడు. | |
| కర్మ - | ద్వితీయ - బాలః ఉద్యానంపశ్యతి = బాలుడు ఉద్యానమును చూచుచున్నాడు. | |
| కరణము - | తృతీయ - భక్తః పుష్పైః దేవం పూజయతి = భక్తుడు పూలతో దేవుని పూజించుచున్నాడు. | |
| సంప్రదానము - | చతుర్థి - నృపః విప్రాయ గాం దదాతి = రాజు బ్రాహ్మణునికి ఆవును ఇచ్చుచున్నాడు. | |
| అపాదానము - | పంచమి - వృక్షాత్ పర్ణం పతతి = చెట్టునుండి ఆకు రాలుచున్నది. | |
| అధికరణము - | సప్తమి - గ్రామే జనాః వసన్తి. = గ్రామమున జనులు వసించుచున్నారు. | |

ఈ ఆఱు కారకవిభక్తులై యున్నవి. కర్మణి ప్రయోగమున కర్త తృతీయా విభక్తిలోను, కర్మ ప్రథమా విభక్తిలోను ఉండుట విశేషముగా గ్రహింపదగును.

మిగిలినవిభక్తులు : షష్ఠి - సంబంధమును తెలుపును.

ఉ : దశరథస్య పుత్రః శ్రీరామః.

దశరధునియొక్క కుమారుడు శ్రీరాముడు

ప్రథమావిశేషమగు సంబోధన ప్రథమ పిలుపునందు వాడబడును.

ఉ: (1) హేరామ! =ఓరామా, (2) రక్షరక్ష మహేశ్వర!
= ఓ మహేశ్వరా! రక్షింపుము. రక్షింపుము.

ఉ: హేబాల! రణాఙ్గణే నృపః శత్రూణాం సంహారాయ తూణీరాత్ శరాన్ ఉద్ధరతి.

ఓ బాలుడా! రణభూమియందు రాజు శత్రువులయొక్క సంహారముకొఱకు అంబులపొదినుండి బాణములను పైకి తీయుచున్నాడు.

అను వాక్యమున ఒక తిఙన్తపదమును, అన్ని విభక్తులతో సుబన్త పదన్తములును గలవు.

సంస్కృతభాషా ప్రవేశమునకు కారక ప్రయోగ పరిజ్ఞానమావశ్యకము. ఇంతవరకు విడివిడి పదములు ఎన్ని తీరులుగా నుండునో చూపబడినది. వాక్య నిర్మాణము ఏ విధముగా నుండునో తరువాత ప్రకరణమున చూపబడును.

## వాక్యము (అనువృత్తము)

## పురుష వచన నియమము

వాక్యమున కర్తృపదము, క్రియాపదము తప్పకయుండు, ననియు క్రియాపదమున ప్రథమమధ్యమోత్తమ పురుషులును ఒక్కొక్క పురుషకు ఏకవచన ద్వివచన బహువచనము లుండుననియు పూర్వము చెప్పబడినది. ఇచట కర్తృపద క్రియాపదములకు పురుషనియమము, వచన నియమము పేర్కొనబడుచున్నవి.

## పురుష నియమము

ఎట్లనగా : 'అస్మది ఉత్తమః'

అహమ్ ఆవామ్ వయమ్ అనుపదములు

(నేను) (మేమిద్దఱము) (మేము)

కర్తృపదములుగా నున్నపుడు క్రియాపదము ఉత్తమపురుషలో నుండవలయును.

'యుష్మది మధ్యమః' త్వమ్ (నీవు) యువామ్ (మీరిద్దరు) యూయమ్ (మీరు) అను పదములు కర్తృపదములుగా నున్నపుడు క్రియాపదము మధ్యమ పురుషలో నుండవలయును.

'శేషే ప్రథమః' సః తౌ తే. ఏషః ఏతౌ ఏతే
(వాడు వారు వీడు వీరు)

ఇత్యాదిపదములు కర్తృపదములుగా వచ్చినపుడు క్రియ ప్రథమపురుషలో నుండవలయును.

## వచననియమము

ఇట్లే వచన నియమముగూడ పాటింపవలయును. అనగా కర్తృ పదము ఏకవచనములోనున్న క్రియాపదముగూడ ఏకవచనము లోనే యుండవలయును. కర్తృపదము ద్వివచనములోనున్న క్రియాపదము ద్వివచనములో నుండవలయును. కర్త బహువచ నములోనున్న క్రియగూడ బహువచనములో యుండవలయును.

| | I | II |
|---|---|---|
| ఉ : | అహమ్ భవామి | అహమ్ వన్దే ఉ- ఏ |
| | (నేను ఉన్నాను) | (నేనునమస్కరించుచున్నాను) |
| | ఆవామ్-భవావః | ఆవామ్ వన్దావహే ఉ-ద్వి |
| | (మేమిద్దఱం ఉన్నాము) | (మేమిద్దఱము నమస్కరించుచున్నాము) |

| | |
|---|---|
| వయమ్-భవామః | వయమ్ వన్దామహే ఉ-ద్వి |
| (మేము ఉన్నాము) | (మేము నమస్కరించుచున్నాము) |
| త్వమ్ భవసి | త్వమ్ వన్దసే మ. ఏ |
| (నీవు ఉన్నావు) | (నీవు నమస్కరించుచున్నావు) |
| యువామ్ భవథః | యువామ్ వన్దేథే మ. ద్వి |
| (మీరిద్దఱు ఉన్నారు) | (మీరిద్దఱు నమస్కరించుచున్నారు) |
| యూయమ్ భవథ | యూయమ్ వన్దధ్వే మ. బ |
| (మీరు ఉన్నారు) | (మీరు నమస్కరించుచున్నారు) |
| (ఏషః) సః భవతి | సః వన్దతే ప్ర. ఏ |
| (వాడు ఉన్నాడు) | (వాడు నమస్కరించుచున్నాడు) |
| (ఏతౌ) తౌ భవతః | తౌ వన్దేతే ప్ర. ద్వి |
| (ఏతే) తే భవన్తి | తేవన్దన్తే ప్ర. బ. |
| (వారు ఉన్నారు) | (వారు నమస్కరించుచున్నారు) |

ఎపుడు కర్తృపద క్రియాపదములకు పురుషభేదము చేయబడునో అపుడు వాక్యము దుష్టమగును.

ఉ:- 1) అహమ్భవతి 2) త్వమ్భవామి మొదలగు వాక్యములు అసాధువులు.

అట్లే కర్తృపద క్రియాపదములకు వచనభేదము ఉండరాదు. 'సః భవన్తి'; 'యూయమ్భవసి' మొదలగు వాక్యములు తప్పులు.

దీనినిబట్టి కర్తృపద క్రియాపదములకు పురుషవచన నియమము అవశ్యము పాటింపవలయునని తేలినది.

## ప్రయోగములు III

సంస్కృతభాషలో క్రియాపదమునుబట్టి వాక్యప్రయోగము మూడు విధములుగా నుండును.

రామః అస్తి = రాముడు ఉన్నాడు
కృష్ణః శేతే = కృష్ణుడు పరుండియున్నాడు
సూర్యః ప్రకాశతే = సూర్యుడు ప్రకాశించుచున్నాడు
బాలః వర్ధతే = బాలుడు పెరుగుచున్నాడు.

ఈ మొదలగు ప్రయోగములు కర్తరి ప్రయోగములు అని పిలువబడును.

ఇచట ధాతువుమీదనున్న లకారము కర్తను బోధించుచున్నది.

ఎట్లనగా :—

కః అస్తి ? రామః అస్తి = ఎవడు ఉన్నాడు ? రాముడున్నాడు.
కః శేతే ? కృష్ణః శేతే = ఎవడు పరుండియున్నాడు ? కృష్ణుడు పరుండియున్నాడు.
కః ప్రకాశతే : సూర్యః ప్రకాశతే = ఎవడు ప్రకాశించుచున్నాడు ? సూర్యుడు ప్రకాశించుచున్నాడు.
కః వర్ధతే ? బాలః వర్ధతే = ఎవడు పెరుగుచున్నాడు ? బాలుడు పెరుగుచున్నాడు.

ఇందువలన దీనికి కర్తరి ప్రయోగము అని పేరు వచ్చినది.

*కర్తరి ప్రయోగమున కర్తృపదము ప్రథమా విభక్తిలో నుండుము. మఱియు కర్తను అనుసరించి క్రియాపదమునకు పురుషవచనములు ఉండును.

| | ఏ | ద్వి | బ | |
|---|---|---|---|---|
| ఉ:- బాలః | అస్తి | బాలౌ స్తః | బాలాఃసన్తి | ప్ర. పు. |
| (బాలుడు ఉన్నాడు, | | ఇద్దఱుబాలురు ఉన్నారు, | బాలురు ఉన్నారు.) | |
| త్వమ్ | అసి | యువామ్ స్థః | యూయం స్థ. | మ. పు. |
| (నీవు | ఉన్నావు | మీరిద్దరు ఉన్నారు | మీరు ఉన్నారు) | |
| అహమ్ | అస్మి | ఆవామ్ స్వః | వయమ్ స్మః | ఉ. పు. |
| (నేను | ఉన్నాను | మేమిద్దఱము ఉన్నాము | మేము ఉన్నాము) | |

## సకర్మక కర్తృప్రయోగము

క్రియ సకర్మకమైనచో ప్రయోగమున కర్మనుగూడ చేర్పవలయును.

బాలః పాఠం పఠతి = బాలుడు పాఠమును చదువుచున్నాడు

కృష్ణః గణేశం నమతి = కృష్ణుడు గణాధిపుని నమస్కరించుచున్నాడు

రామః లేఖం లిఖతి = రాముడుఉత్తరమును వ్రాయుచున్నాడు

ఇత్యాదులు సకర్మక కర్తరి ప్రయోగములు

## కర్మణి ప్రయోగము

బాలేన పాఠః పఠ్యతే = బాలునిచేత పాఠము చదువబడుచున్నది.

కృష్ణేన గణేశః నమ్యతే = కృష్ణునిచేత వినాయకుడు నమస్కరింప బడుచున్నాడు.

రామేణ లేఖః లిఖ్యతే = రామునిచేత ఉత్తరము వ్రాయబడుచున్నది.

ఇవి కర్మణి ప్రయోగమునకు ఉదాహరణములు; ఇచట క్రియాపదము కర్మనుబట్టి పురుషవచనములు కలిగియుండును. వెనుకటి సకర్మక కర్తరి ప్రయోగములోని యుదాహరణములే మారి కర్మణి ప్రయోగములో నుదాహరణములైనవి. కర్తరి ప్రయోగమున కర్త ప్రథమావిభక్తిలోను, కర్మ ద్వితీయలోను ఉండగా కర్మణి ప్రయోగమున కర్త తృతీయా విభక్తిలోను, కర్మ ప్రథమావిభక్తిలోను ఉండును. ఇంతవరకు కర్తరి ప్రయోగము, కర్మణి ప్రయోగము అను రెండు ప్రయోగములు నిరూపింపబడినవి.

## భావే ప్రయోగము

సంస్కృత భాషలో భావే ప్రయోగము అసాధారణము. రాముడున్నాడు అను విషయమును రామః భవతి, రామేణ భూయతే అను రెండువాక్యములలో దేనిచేతనైనను బోధింపవచ్చును. అందు 'రామః భవతి' అను వాక్యము కర్తరి ప్రయోగములో నున్నది.

రామేణభూయతే అను వాక్యము భావేప్రయోగములో నున్నది. ధాతువుమీద నున్న లకారము భావమును అనగా ధాతువుయొక్క అర్థమునే చెప్పును కాని కర్తను కాని కర్మను కాని చెప్పదు. అందువలన దీనికి భావేప్రయోగము అని పేరువచ్చినది. భావేప్రయోగమున కర్తృపదము తృతీయా విభక్తిలో నుండును. కర్మపద ముండదు. క్రియాపదము కర్మణి ప్రయోగక్రియాపదమును పోలియుండును. ఐతే భావే ప్రయోగములోని క్రియ ప్రథమ పురుషైక వచనములోనే యుండును. మధ్య మోత్తమ పురుషలుగాని, ద్వివచన బహువచనములుగాని దీనికి లేవు.

ఈ విధముగ ప్రయోగములు మూడు చూపబడినవి.

సకర్మకకర్తరి ప్రయోగమును మార్చినచో కర్మణి ప్రయోగము అగును. అకర్మకర్తరి ప్రయోగమును మార్చినచో భావేప్రయోగము అగును.

ఉ.: వాల్మీకిః రామాయణం కృతవాన్ – సకర్మకర్తరి ప్రయోగము.

(వాల్మీకి రామాయణమును రచించెను.)

వాల్మీకినా రామాయణం కృతమ్ - కర్మణిప్రయోగము.

వాల్మీకిచే రామాయణము రచింపబడెను.

| | |
|---|---|
| సూర్యః ప్రకాశతే (సూర్యుడు ప్రకాశించుచున్నాడు) | = అకర్మక కర్తరి ప్రయోగము. |
| సూర్యేణ ప్రకాశ్యతే | = భావే ప్రయోగము. |

## IV

సంస్కృతమున కొన్ని అవ్యయములు (నిపాతములు, ఉపసర్గలు) తఱచుగా ప్రయోగింపబడుచుండును. అందు

**చ, వా, ఇవ, ఏవ, అపి, తు మొదలగునవి నిపాతలు.**

ఇవి ఒక పదము ప్రయోగించిన తరువాత వచ్చుచుండును.

చ = ను; సముచ్చయార్థకము, రామః + చ = రామశ్చ = రాముడును
కృష్ణః + చ = కృష్ణశ్చ = కృష్ణుడును:

వా = వికల్పార్థకము; రామః + వా = రామో వా
రాముడుకాని (రాముడో)
కృష్ణః + వా = కృష్ణో వా = కృష్ణుడుకానీ

ఇవ = వలె; సాదృశ్యార్థకము; రామః + ఇవ = రామ ఇవ
= రామునివలె
+ కృష్ణః ఇవ = కృష్ణ ఇవ
= కృష్ణునివలె

ఏవ = ఏ; అవధారణార్థకము రామః + ఏవ = రామ ఏవ
= రాముడే
కృష్ణః + ఏవ = కృష్ణఏవ = కృష్ణుడే

అపి; కూడ, ను; రామః + అపి = రామోఽపి = రాముడు కూడ

తు = ఐతే; రామః + తు = రామస్తు = రాముడైతే
కృష్ణః + తు = కృష్ణస్తు = కృష్ణుడైతే

ఇవి నిపాతసంజ్ఞ గలవి. వాక్యాదియందు ప్రయోగించరాదు. పూర్వపదముతో కలిపి ఉచ్చరింపబడుచుండును. (ఏకపదమునందువలె సంహిత పాటింపబడుచుండును.) కర్తృకర్మ క్రియాపదములతో నివి చేరినపుడు ప్రయోగములో నివి నిలచియుండును.

### ఉపసర్గలు

ప్ర, పరా, అప, సమ్, అను, ఆ మొదలగునవి ఉపసర్గలు (ప్రాదులు) ఇవి ప్రకర్ష మొదలగు నర్థములందు వచ్చుచుండును.

ధాతువునకు ముందు ప్రయోగింపబడును.

ప్ర - భవతి ప్రభవతి, అనుభవతి

ఆ - గచ్ఛతి ఆగచ్ఛతి అనుగచ్ఛతి

శ్లో. ధాత్వర్థం బాధతే కశ్చిత్ = ఒక ఉపసర్గ ధాతువుయొక్క అర్థమును మార్చివేయును.

ఎట్లనగా

గచ్ఛతి = వెళ్లుచున్నాడు

ఆగచ్ఛతి = వచ్చుచున్నాడు

కశ్చిత్తమను వర్తతే =

ఒక ఉపసర్గ ధాతువుయొక్క అర్థము ననుసరించును.

ఉ గచ్ఛతి; అనుగచ్ఛతి, వెళ్లుచున్నాడు, వెంట వెళ్లుచున్నాడు

తమేవ విశినష్టి అన్యః =

మఱియొక ఉపసర్గ ధాతువు యొక్క అర్థమును విశదీకరించును.

ఉ. నదీ వహతి

నదీ ప్రవహతి = నది ప్రవహించుచున్నది.

ఉపసర్గగతిస్త్రిధా = ఉపసర్గలనడక (ప్రయోగించువిధము) మూడు రీతులుగా నుండును.

ధాతూపసర్గలయందు సంధినిత్యముగా పాటింపవలయును.
ప్ర + అర్చతి = ప్రార్చతి = చక్కగా పూజించుచున్నాడు.
ఉప + ఏతి = ఉపైతి = దగ్గఱకు పోవుచున్నాడు.
పరి + ఈక్షతే = పరీక్షతే = పరీక్షించుచున్నాడు.
(చూచుచున్నాడు)
ప్రతి + ఈక్షతే = ప్రతీక్షతే = వేచియున్నాడు.

ఉపసర్గలు ధాతువునకుముందు ఇతర పద వ్యవధానము లేకుండ జేరి సంధివశమున కలిసిపోవుటచేతను క్రియాగత విశేషమును బోధించి క్రియకు నూతన రూపమిచ్చుటచేతను కావ్యపాఠమున క్రియాపదభాగములుగా భావింపబడుచున్నవి.

ఉపసర్గ అర్థవిశేష స్ఫోరకము. ధాతువుమీద దీని ప్రభావము మెండు. దీనివలన అకర్మక ధాతువు ఒకప్పుడు సకర్మకమగును.

ఉ. రామః భవతి = రాముడు ఉన్నాడు (అకర్మకము)
రామః సుఖమ్ అను భవతి (సకర్మకము)
రాముడు సుఖమును అనుభవించుచున్నాడు.

ప్రయోగములో ధాతువుతో కూడ ఉపసర్గలు నిలిచియుండును.

(కరణ సంప్రదానాదికారకపదములకు ప్రయోగత్రయములో ప్రవేశము లేదు.)

## సంధిప్రకరణము V

పదములను ఒకదాని వెంట నొకటి యుచ్చరించునపుడు కొన్ని మార్పులు వచ్చుచుండును. అట్లే ప్రకృతి ప్రత్యయములలో సహోచ్చారణమున కొన్ని మార్పులు ఘటిల్లును. అట్టి మార్పులను తెలియచేయుటకు సంధిప్రకరణ మేర్పడినది.

శ్లో॥ సంహితైకపదేనిత్యా నిత్యాధాతూపసర్గయోః,
నిత్యా సమాసే, వాక్యేతుసావివక్షా మపేక్షతే.

ప్రకృతి ప్రత్యయములను విలమ్బముగా నుచ్చరింపరాదు, అచట సంధి తప్పక చేసితీరవలయును. అట్లే ధాతువునకు, ఉపసర్గమునకు సంధి ఆవశ్యము పాటింపవలయును. సమాసమున సంధి నిత్యము. వాక్యమున ఒక పదముతరువాత మఱియొక పదము నొకప్పుడు స్పష్టముగా గ్రహించుటకై విలంబముగా నుచ్చరింపవచ్చును. అపుడు సంధి రాదు. వెంట వెంట నుచ్చరించునపుడు సంధిచేయవలసి యుండును.

సంస్కృతమున గద్యవాఙ్మయముకంటె పద్యవాఙ్మయము అధికమగుటచేతను పద్యమున సంధులు అవశ్యము పాటింపవలసి యుండుటచేతను పదము లొకదానితో నొకటి కలిసిపోయి అర్థము గ్రహించుటకు క్లేశము ఏర్పడుచున్నది. సంధిప్రకరణ సాహాయ్యమున పదములను విడదీసికొన గలిగినచో సంస్కృత వాక్యములయొక్క అర్థమును మనము సులభ

ముగా గ్రహింపగలుగుదుము. సంస్కృతభాషలోని పదములను ఆంధ్రములోఁ (నూటికి అఱువదికిపైగా) తెలుగు విభక్తిప్రత్యయములను జేర్చి వాడుచుండుటయే దీనికి కారణము. సంస్కృతసంధి పరిచయము సంస్కృతభాషా ప్రవేశమునకే కాక ఆంధ్రభాషాపరిజ్ఞానమునకును ఉపయోగించుచున్నది.

## సంధులు

సంస్కృత భాషలో సంధులు ఐదు. అవి (1) స్వరసంధి (2) హల్ సంధి (3) ప్రకృతిభావసంధి (4) విసర్గసంధి (5) స్వాదిసంధి, అనునవి.

(1) స్వరసంధి = అచ్చునకు అచ్చుపరముగునపుడు వచ్చు సంధి = దీని భేదములే గుణసంధి, వృద్ధిసంధి, సవర్ణదీర్ఘసంధి, యణాదేశసంధి.

గుణసంధి: అ, ఏ, ఓ లకు గుణము అని పేరు. అవి వచ్చిన గుణసంధి. అ, వచ్చునపుడు 'ర్' తో కలసివచ్చును. అనగా 'అర్' వచ్చును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఉ: | అ + ఇ | = ఏ; | దేవ | + ఇన్ద్రః | = | దేవేన్ద్రః |
| | అ + ఈ | = ఏ; | నగ | + ఈశః | = | నగేశః |
| | అ + ఉ | = ఓ; | చన్ద్ర | + ఉదయః | = | చన్ద్రోదయః, |
| | అ + ఋ | = అర్ | సప్త | + ఋషయః | = | సప్తర్షయః |
| | ఆ + ఋ | = అర్ | మహా | + ఋషిః | = | మహర్షిః. |

వృద్ధిసంధి: ఆ, ఐ, ఔ, లకు వృద్ధి అని పేరు.

'ఆ' వచ్చునపుడు 'ర్' లో కలసివచ్చును. అనగా 'ఆర్' వచ్చును.

## హల్ సంధి

### హల్లునకు వచ్చు సంధి హల్సంధి

(1) శ్చుత్వసంధి :-

సకారమునకు శకారము వచ్చును } శకారచవర్గలతో
తవర్గ కు చవర్గ వచ్చును } చేరినపుడు

'స్' స్థానమున 'శ్' ఉ = రామస్ (ః) + చ = రామ (శ్ చ) శ్చ,
రామస్ (ః) + శేతే = రామశ్శేతే
'త్' ,, 'చ్' సత్ + చ = స(చ్ చ) చ్చ.
'న్' ,, 'ఞ్' శార్ఙ్గిన్ + జయ = శార్ఙ్గిఞ్జయ.

(2) ష్టుత్వసంధి :-

సకారమునకు షకారమువచ్చును } షకారటవర్గలతో
తవర్గకు టవర్గ వచ్చును } జేరినపుడు

'స్' స్థానమున 'ష్' ఉ:- రామస్ + షష్ఠః = రామష్షష్ఠః
'త్' ,, 'ట్' పేష్ + తా = పేష్టా
'ద్' ,, 'డ్' తద్ + టీకా = త (డ్) ట్టీకా

(3) జశ్త్వసంధి :- జ్, బ్, గ్, డ్, ద్ వచ్చును.

క్ స్థానమున 'గ్' ఆదేశము; వాక్ + ఈశః = వాగీశః
'త్' ,, 'ద్' చిత్ + రూపమ్ = చిద్రూపమ్ }
'ష్' డ్ సత్ + అపి = సదపి }
షష్ + వర్గః = షడ్వర్గః

చర్త్వసంధి:- చ్, ట్, త్, క్, ప్ వచ్చును. తద్ + శివః = తచ్ శివః
ఛత్వసంధి: శకారమునకు ఛకారము వచ్చును. తచ్ + శివః = తచ్ఛివః
అనుస్వారసంధి:- మకారమునకు అనుస్వారము (ం) వచ్చును.
హరిమ్ + వన్దే = హరింవన్దే

వాక్యాన్తమున మకారమునకు అనుస్వారముచేయరాదు భజామ్యహం, తప్ప అచ్చుపరముగా నున్నపుడును అనుస్వారము చేయరాదు. అహం అపి;

## విసర్గసంధి

విసర్గకు స్, ష్, ః ఆదేశములుగా వచ్చును.

ఉ:- రామః+తరతి = రామస్తరతి
నమః+కరోతి = నమస్కరోతి
నమః+ తే = నమస్తే.
} విసర్గ స్థానమున సకారము.

విసర్గస్థానమున షకారమునకు ఉదాహరణము

ఉ:- నిః+ప్రత్యూహమ్ = నిష్ప్రత్యూహమ్
దుః+కృతమ్ = దుష్కృతమ్

## విసర్గకు విసర్గ

ఉ:- నక్షత్రేశః+క్షపాకరః = నక్షత్రేశః క్షపాకరః,
ఒకచోట విసర్గకు లోపముకూడ వచ్చును.
హరిః+స్ఫురతి = హరిస్ఫురతి
రామః+స్థాతా = రామస్థాతా

## స్వాది సంధి

సు, ఔ, జస్ మొదలగు విభక్తులలో వచ్చు మార్పును తెలియజేయుసంధి.

అ + స్ + అ = ఓ; శివ + (సు) స్ + అర్చ్యః = శివోఽర్చ్యః,
రామ + స్ + అపి = రామోఽపి
అ + స్ + (హశ్) = ఓ; రామ + స్ + హరిః = రామోహరిః
శివ + స్ + వన్ద్యః = శివో వన్ద్యః
అ + స్ + (అశ్) = యకారము, లోపము; దేవాస్ + ఇహ = దేవా

(హల్) యకారలోపము దేవాస్ + యాన్తి = దేవాయాన్తి
తద్, ఏతద్ శబ్దము మీాద హల్లుపరముగా నున్నపుడు సులోపము

ఉ : స (ః) స్ + శివః = సశివః

ఏషః (స్) విష్ణుః = ఏషవిష్ణుః

విశేషోదాహరణములు :

హరిస్ + రమ్యః = హరీరమ్యః

శమ్భుస్ + రాజతే = శమ్భూరాజతే,

భోస్ + దేవాః = భోదేవాః

అహన్ + గణః = అహర్గణః

ప్రాతర్, పునర్ రేఫాన్తావ్యయములగుటచే స్వాదిసంధి ప్రవర్తింపదు.

ప్రాతర్ + అత్ర = ప్రాతరత్ర ప్రాతోఽత్ర అని కాదు.

పునర్ + అపి = పునరపి పునోఽపి అని కాదు.

ప్రకృతి భావసంధి

ప్రకృతిభావము అనగా ఉన్నది ఉన్నట్లు ఉండుట. అచ్చునకు రావలసిన సంధి రాకపోవుట దీనియభిప్రాయమై యున్నది.

ఈకారాన్త ద్వివచనములకు సంధిరాదు కవీ + ఇమౌ = కవీఇమౌ

ఊకారాన్త ,, ,, విష్ణూ + ఇమౌ = విష్ణూఇమౌ

ఏకారాన్త ,, ,, ద్వే + అపి = ద్వేఅపి

కొన్నిచోట్ల ప్రకృతిభావము వికల్పము, దీర్ఘము హ్రస్వము గూడ నగును.

చక్రీ + అత్ర = చక్రి అత్ర } రెండు రూపములు
చక్ర్యత్ర }

బ్రహ్మ + ఋషిః = బ్రహ్మఋషిః }
బ్రహ్మర్షిః }

ప్రకృతిభావసంధి స్వరసంధి భేదముగా పరిగణింపవచ్చును. అచ్చులకు రావలసిన సంధికార్యములు రాకపోవుట దీని లక్షణమై యున్నది. అయినను భాషాదృష్టితో నెచట సంధిరాదో విశేషముగా గమనార్హమగుటచే ప్రత్యేకముగా పేర్కొనబడినది. ఇంతవరకు ప్రసిద్ధములగు కొన్ని సంధులు చూపబడినవి. వాక్యమున సంధి వక్తయిష్టమునుబట్టి చేయవచ్చును. మానవచ్చును. పదమధ్యమునను, సమాసమధ్యమునను సంధి మానరాదు.

## వృత్తి

అనేకపదములను ప్రయోగించి భావమును ప్రకటింపవలసినచోట సంస్కృతభాషలో క్లుప్తీకరణపద్ధతి యొకటికలదు. అదియే వృత్తి.

1. మాతాచపితాచ (అని ప్రయోగింపవలసిన చోట) = పితరౌ (తల్లిదండ్రులు) ఏకశేషవృత్తి ప్రయోగించిన చాలును.

2. దశరథస్య అపత్యంపుమాన్ (దశరథుని యొక్క కుమారుడు) = దాశరథిః తద్ధితవృత్తి

3. రమన్తేయోగినః అస్మిన్ ఇతి (యోగులుఇతనియందు క్రీడింతురు గనుక) = రామః కృద్వృత్తి "రామః" అని పేరువచ్చెను

4. జ్ఞాతుమ్ ఇచ్ఛతి (తెలిసికొనుటకు కోరుచున్నాడు) = జిజ్ఞాసతే, సనాద్యన్తధాతువృత్తి

౮. పార్వతీచ పరమేశ్వరశ్చ = పార్వతీపరమేశ్వరౌ - సమాస వృత్తి

'పరార్థాభిధానం వృత్తిః' అని నిర్వచనము.

అనేక పదములు చేరి బోధింపవలసిన విశిష్టార్థమును లేదా అఖండార్థమును బోధించునది వృత్తి. వృత్త్యర్థావ బోధకం వాక్యం విగ్రహః

వృత్తియొక్క అర్థమును బోధించు పదసముదాయము నకు విగ్రహము అని పేరు. వృత్తులు ఐదు పైన పేర్కొన బడినవి. అన్ని వృత్తులకు విగ్రహము ఉండును.

## సమాసము

వృత్తులలో సమాసము ఒకటి. సమాసములో కనీసము రెండు పదములుండును. రామస్య బాణః అను రెండు పదములు కలిసి "రామబాణః" అని ఏకపదముగా అయినవి. ఇందు రామబాణః సమాసపదము. రామస్యబాణః అను పదములు విగ్రహము. ఇట్లే "శివస్యధనుః" విగ్రహము "శివధనుః" అనునది సమాసము.

సమాసమున పూర్వపదములమీద విభక్తి కనుపించదు. తుదిపదముమీద మాత్రమే విభక్తి కనుపించును. సమాసమున చేరియున్న పదముల మొదటి విభక్తులు లోపించి సముదాయముమీద మఱల నొక విభక్తి వచ్చుటచే సమాస పదము ఏకపదము అయినది.

సమాసములో విడివిడిపదములు అనేకములుండును. ఇన్ని పదములకే సమాసముచేసికొన వలయును అను నియమము లేదు.

ఏకపదమునందు సమాససంజ్ఞ ప్రవర్తింపదు.

సమాసమునకు విగ్రహము ఉండును.

సమాసమున పూర్వపదముల మీది విభక్తి లోపించిన పిమ్మట సంధిసూత్రము ప్రవర్తింప వీలున్నచో తప్పక సంధి చేయవలయును.

ఉ:- సూర్యస్య ఉదయః = 'సూర్యఉదయః' అని ఉంచరాదు. అ + ఉ = ఓ; గుణసంధిచేసి 'సూర్యోదయః' అని ప్రయోగింప వలయును.

సమాసము ప్రసిద్ధిని అనుసరించి ఆఱు విధములు.

అవి (1) తత్పురుషము, (2) కర్మధారయము, (3) ద్విగువు, (4) అవ్యయీభావము, (5) బహువ్రీహి, (6) ద్వన్ద్వము, అయియున్నవి.

ఉ :—

| విగ్రహము | సమాసపదము | సమాసనామము |
|---|---|---|
| రాజ్ఞః పురుషః | రాజపురుషః | తత్పురుషసమాసము. |
| నీలమ్ ఉత్పలమ్ | నీలోత్పలమ్ | కర్మధారయ ,, |
| పఞ్చానాంవటానాంసమాహారః, | పఞ్చవటీ, | ద్విగు ,, |
| దినే దినే | ప్రతిదినమ్ | అవ్యయీభావ ,, |
| పీతమ్అమ్బరంయస్యసః, | పీతామ్బరః | బహువ్రీహి ,, |
| రామశ్చకృష్ణశ్చ | రామకృష్ణౌ | ద్వన్ద్వ ,, |

తత్పురుషాది విశేష సంజ్ఞలేని సమాసముకూడ కలదు.
పూర్వంభూతః భూతపూర్వః సామాన్య సమాసము.
వాగర్థౌ ఇవ వాగర్థావివ ,,
దీనిని ఇవసమాసము అని గూడ వ్యవహరించెదరు.

## తత్పురుష సమాసము

ఇది ఎనుబది విధములు. ప్రథమ మొదలగు ఏడు విభక్తులతో ఏడు భేదములు + నఞ్ తత్పురుష ఒకటి. మొత్తము ఎనిమిది.

## ప్రథమా తత్పురుషము

| విగ్రహము | సమాసపదము |
|---|---|
| పూర్వః కాయస్య = | పూర్వకాయః |
| = (శరీరముయొక్క మొదటిభాగము) | (మొండెము) |
| ఉత్తరః కాయస్య = | ఉత్తరకాయః |
| (శరీరముయొక్క చివరభాగము) | (శిరము) |
| అర్ధమ్ రూప్యస్య = | అర్ధరూప్యమ్ |
| (రూపాయియొక్క సగము) | (అర్ధరూపాయి) |

(1) పూర్వకాయః (2) ఉత్తరకాయః (3) అర్ధరూప్యమ్ అను మూడుదాహరణలలో మొదటి పదములు "పూర్వః" "ఉత్తరః" "అర్ధమ్" అనునవి ప్రథమావిభక్తిలోనున్నవి. కనుక ఈ సమాసమునకు ప్రథమాతత్పురుష మని పేరు.

## ద్వితీయా తత్పురుషము

విగ్రహము సమాసపదము

కృష్ణంశ్రితః = కృష్ణశ్రితః = కృష్ణుని ఆశ్రయించినవాడు.
దుఃఖమ్ అతీతః = దుఃఖాతీతః = దుఃఖమును దాటినవాడు.

సమాసములో మొదట ఉన్న 'కృష్ణ', 'దుఃఖ' అనునవి ద్వితీయా విభక్తిలో నున్నట్లు విగ్రహమున స్పష్టమగు చున్నది. కనుక దీనికి ద్వితీయా తత్పురుష అని పేరు.

## తృతీయాతత్పురుషము

| విగ్రహము | సమాసపదము | అర్థము |
|---|---|---|
| మాసేనపూర్వః | మాసపూర్వః | నెలచేత పెద్దవాడు |
| విద్యయానిపుణః | విద్యానిపుణః | విద్యచేత నేర్పరి |
| పిత్రా సదృశః | పితృసదృశః | తండ్రితో సమానుడు. |

ఇటు పూర్వపదములు తృతీయావిభక్తిలో నున్నందున తృతీయాతత్పురుష అని పేరు వచ్చినది.

## చతుర్థీ తత్పురుషము

| | | |
|---|---|---|
| జనాయహితమ్ | జనహితమ్ | జనముకొఱకు హితమైనది |
| భూతేభ్యఃబలిః | భూతబలిః | భూతములకొఱకు బలి |
| గవే సుఖమ్ | గోసుఖమ్ | గోవుకొఱకు సుఖము |

పూర్వపదములు చతుర్థీ విభక్తి యందున్నవి కావున చతుర్థీ తత్పురుషము అయినది.

## పఞ్చమీ తత్పురుషము

| | | |
|---|---|---|
| చోరాత్ భయమ్ | చోరభయమ్ | = దొంగవలన భయము |
| స్వర్గాత్ పతితః | స్వర్గపతితః | = స్వర్గమునుండి పడినవాడు |
| న్యాయాత్ అపేతః | న్యాయాపేతః | = న్యాయమునుండి వైదొలగినవాడు |

పూర్వపదములు పఞ్చమీ విభక్తియందున్నవి కావున పఞ్చమీ తత్పురుషము.

## షష్ఠీతత్పురుషము

| విగ్రహము | సమాసపదము | అర్థము |
| --- | --- | --- |
| రాజ్ఞః పురుషః | రాజపురుషః | రాజుయొక్క సేవకుడు |
| సూర్యస్య ఉదయః | సూర్యోదయః | సూర్యునియొక్క ఉదయము |
| వృక్షస్య మూలమ్ | వృక్షమూలమ్ | చెట్టుయొక్క మొదలు |

ఇట పూర్వపదములు షష్ఠీ విభక్తియందున్నవి

## సప్తమీ తత్పురుష

| | | |
| --- | --- | --- |
| ఈశ్వరే అధీనమ్ | ఈశ్వరాధీనమ్ | ఈశ్వరునియందు అధీనమైనది |
| దానే శౌణ్డః | దానశౌణ్డః | దానమునందు ప్రవీణుడు |
| సాంకాశ్యేసిద్ధః | సాంకాశ్యసిద్ధః | సాంకాశ్య నగరమందు సిద్ధుడు |

ఇట పూర్వపదములు సప్తమీవిభక్తియందున్నవి

తత్పురుష సమాసమున పూర్వపదములు ఏ విభక్తియందుండునో సమాసమునకు ఆవిభక్తితో పేరువచ్చును, ఉ॥ ప్రథమాతత్పురుష మొ॥

## నఞ్ తత్పురుష

| | | |
| --- | --- | --- |
| నజ్ఞానమ్ | అజ్ఞానమ్ | జ్ఞానముకానిది |
| నసురాః | అసురాః | దేవతలుకానివారు (రాక్షసులు) |
| నధర్మః | అధర్మః | ధర్మముకానిది |
| నఉచితః | అనుచితః | తగనిది |

సమాసములో నఞ్ లోని నకారములోపించి 'అ' గా మిగులును.

అచ్చు పరమగునపుడు 'న్' అధికముగా జేరును. 'అన్' గా కనుపించును.

## కర్మధారయ సమాసము

తత్పురుషము సమానాధికరణమైనచో కర్మధారయ మన బడును. ఈ సమాసములో చేరిన పదములు రెండు ఒకే

విభ_క్తిలో నుండును. వెనుక తత్పురుషోదాహరణములలో పూర్వపదము ఒక విభ_క్తిలోను, ఉ_త్తరపదము మఱియొక విభ_క్తిలోను ఉన్నవి.

కర్మధారయసమాసము ఏడు విధములు.

### (1) విశేషణపూర్వపదకర్మధారయము

విశేషణ విశేష్యపదములకువచ్చు సమాసము కర్మధారయము అని ప్రసిద్ధి.

| విగ్రహము | సమాసపదము | అర్థము |
|---|---|---|
| నీలమ్ ఉత్పలమ్ | నీలోత్పలమ్ | నల్లకలువ |
| మధురః రసః | మధురరసః | తియ్యనిరసము |
| అల్పః వాతః | అల్పవాతః | కొలదిగాలి |
| రమ్యా లతా | రమ్యలతా | అందమైనతీగె |

ఇచట 'నీలమ్' 'మధురః' 'అల్పః' 'రమ్యా' అనునవి పూర్వపదములు ; విశేషణములు. కనుక ఈ సమాసము నకు విశేషణ పూర్వ పద కర్మధారయము.

### (2) విశేష్య పూర్వ పద కర్మధారయము

| | | |
|---|---|---|
| వ్యంసకః మయూరః | మయూరవ్యంసకః | తుంటరి నెమిలి |
| అన్యః గ్రామః | గ్రామా_న్తరమ్ | మఱియొక ఊరు |

ఇంట మయూరః, గ్రామః అనునవి విశేష్యపదములు ముందున్నవి. కావున విశేష్య పూర్వ పద కర్మధారయము.

## (3) విశేషణోభయపద కర్మధారయము

ఇచ్చట సమాసములోచేరిన రెండు పదములు విశేషణములు.

| విగ్రహము | | | | సమాసపదము | అర్థము |
|---|---|---|---|---|---|
| (ప్రథమమ్) సుప్తః | (పశ్చాత్) | ఉత్థితః | | సుప్తోత్థితః | నిద్రపోయిలేచినవాడు |
| ,, | స్నాతః | ,, | అనులిప్తః | స్నాతానులిప్తః | స్నానముచేసి మైపూతపూసికొనినవాడు |
| ,, | నిశ్చితమ్ | ,, | ప్రచితమ్ | నిశ్చప్రచమ్ | నిశ్చితము ప్రసిద్ధము. |

## (4) ఉపమాన పూర్వపదకర్మ ధారయము

| | | |
|---|---|---|
| రతిరివసున్దరీ | రతిసున్దరీ | రతీదేవివలె అందమైనది |
| ఘనఃఇవశ్యామః | ఘనశ్యామః | మేఘమువలె నల్లనివాడు |
| ద్రాక్షాఇవమధురా | ద్రాక్షామధురా | ద్రాక్షవలెమధురమైనది |
| లతాఇవ తన్వీ | లతా తన్వీ | తీగవలె సన్ననిది |

దేనితోపోల్తుమో అది ఉపమానము. ఏది పోల్చబడునో అది ఉపమేయము. రతీదేవితో కాన్త పోల్చబడినది. కనుక రతి ఉపమానము.

రతిః, ఘనః, ద్రాక్షా, లతా అనునవి ఉపమానపదములు ముందున్నవి. కనుక ఈ సమాసము ఉపమాన పూర్వపదకర్మధారయము.

### (5) ఉపమానోత్తర పద కర్మధారయము

పురుషః వ్యాఘ్రఇవ పురుషవ్యాఘ్రః = పెద్దపులివంటిపురుషుడు
(పురుష శ్రేష్ఠుడు)

కపిః కుఞ్జరః ఇవ కపికుఞ్జరః = ఏనుగువంటి కోతి
(వానర శ్రేష్ఠము)

వ్యాఘ్ర-కుఞ్జర పదములు ఉపమానపదములు. తరువాత నున్నవి. కనుక ఈ సమాసము ఉపమానోత్తర పద కర్మధారయము.

వ్యాఘ్ర, కుఞ్జర, శార్దూల, సింహ, ఋషభాదిపదములు ఉత్తరపదములుగా నున్నప్పుడు శ్రేష్ఠవాచకములు.

### (6) సంభావనా పూర్వపద కర్మధారయము

సంభావనా = ఊహ,

ఇట సంభావనాపదముచేత సంజ్ఞనుగూడ గ్రహింపవలయును.

| విగ్రహము | సమాసపదము | అర్థము |
|---|---|---|
| విన్ధ్యః 'ఇతి' పర్వతః | విన్ధ్యపర్వతః | విన్ధ్యమనెడి పర్వతము |
| చూతః ఇతి వృక్షః | చూతవృక్షః | మామిడిచెట్టు |

ఒక పర్వతమునకు 'విన్ధ్యః' అని పేరు. పర్వతవిశేషము విన్ధ్యము

ఒక వృక్షమునకు 'చూతః' అని పేరు. వృక్షవిశేషము చూతము.

| | | |
|---|---|---|
| గజః ఇతిమనీషా | గజమనీషా | ఏనుగు అనెడి బుద్ధి (ఇచట ఊహ) |

ఇట సంభావనాపదములు పూర్వమునందున్నవి కావున ఇది సంభావనా పూర్వపద కర్మధారయము.

## (7) అవధారణా పూర్వపద కర్మధారయము

వినయః ఏవధనమ్ వినయధనమ్ = వినయము అనే ధనము
కవిః ఏవసాగరః కవిసాగరః = కవి యనే సముద్రము

ఇంట ధనము ఏది? వినయమే } అని అవధారణము (నిశ్చ
సాగరము ఎవడు? కవియే } యము) చేయబడుచున్నది

కావున ఇది అవధారణా పూర్వపదకర్మధారయము

ఈవిధముగా కర్మధారయ సమాస భేదములు ఏడుచూపబడినవి.

కర్మధారయ సమాసము తత్పురుష సమాస విశేషమై యున్నది.

## ద్విగుసమాసము

కర్మధారయ సమాసములో పూర్వపదము సంఖ్యావాచక మయిన ద్విగు సమాసమగును.

| విగ్రహము | సమాసపదము | అర్థము |
|---|---|---|
| పఞ్చానాంవటానాంసమాహారః (ఐదుమఱ్ఱిచెట్లయొక్క సముదాయము) | పఞ్చవటి | ఐదుమఱ్ఱిచెట్లుఉండుచోటు |
| త్రయాణాంభువనానాం సమాహారః | త్రిభువనమ్ | మూడులోకములు. |
| షణ్ణాం మాతౄణామ్ అపత్యంపుమాన్ (ఆఱుగురు తల్లుల మగబిడ్డ) | షాణ్మాతురః | కుమారస్వామి. |

ఇంచట, పఞ్చ, త్రి, షట్ఛబ్దములు పూర్వపదములు, సంఖ్యావాచకములు కావున ఈ సమాసము ద్విగుసమాసము.

## వ్యాకరణము

### అవ్యయీభావసమాసము

అవ్యయమునకు మఱియొక పదముతో వచ్చు సమాసము అవ్యయీభావసమాసము.

ఇది రెండువిధములు. అవ్యయపూర్వపదము– నామపూర్వపదము.

### అవ్యయపూర్వపదము

| | | |
|---|---|---|
| అహని అహని | ప్రత్యహమ్ | ప్రతిదినము |
| శక్తిమ్ అనతిక్రమ్య | యథాశక్తి | శక్తినిమించకుండ |

ఇట 'ప్రతి' 'యథా' అను అవ్యయములు పూర్వపదములు.

| | | |
|---|---|---|
| శాకస్య లేశః | శాక ప్రతి | శాకలేశము |
| సూపస్య లేశః | సూప ప్రతి | సూపలేశము. |

ఇవి నామ పూర్వ పదావ్యయీభావసమాసమునకు ఉదాహరణములు.

### బహువ్రీహిసమాసము

సమాసములోచేరియున్న పదములయొక్క అర్థము కాక మఱియొక పదముయొక్క అర్థము (కలవాడు) ప్రధానముగా నిట బోధింపబడును. పూర్వపదార్థ ప్రధానము అవ్యయీభావసమాసము.

ఉత్తర పదార్థ ప్రధానము తత్పురుష సమాసము కాగా అన్యపదార్థ ప్రధానము బహువ్రీహిసమాసము అని భావము

## ఇది ఏడు విధములు

| విగ్రహము | సమాసపదము | అర్థము |
| --- | --- | --- |
| పీతమ్‌అమ్బరంయస్యసః | పీతామ్బరః | పచ్చనివస్త్రముకలవాడు |

ఇచట 'పీతమ్', 'అమ్బరమ్' అను పదముల యర్థమునకు ప్రాధాన్యము లేదు. పచ్చని వస్త్రమును ధరించినవాడు ప్రధానముగా బోధింపబడుచున్నాడు.

### (1) ద్విపద బహువ్రీహి

| | | |
| --- | --- | --- |
| మహత్ బలంయస్యసః, | మహాబలః | గొప్పబలము కలవాడు |
| వీరాః పురుషాః యస్మిన్ సః గ్రామః, | వీరపురుషః | వీరపురుషులుగల గ్రామము |
| ఉద్ధృతాః శరాః యస్మాత్ సః తూణీరః, | ఉద్ధృతశరః | బాణములుపైకి తీసిన అంబులపొది |
| దత్తః పశుః యస్మై సః శివః | దత్తపశుః | పశువుఇవ్వబడినశివుడు |
| ఊఢః రథః యైస్తేవాహాః, | ఊఢరథాః | రథమును మోసిన గుఱ్ఱములు |
| ప్రాప్తః అగ్నిః యంసః శరః | ప్రాప్తాగ్నిః | అగ్నిచేరిన శరము. |

### (2) బహుపద బహువ్రీహి

| విగ్రహము | సమాసపదము | అర్థము |
| --- | --- | --- |
| దివ్యః సున్దరః విగ్రహః యస్యసః | దివ్యసున్దరవిగ్రహః | దివ్యము సున్దరము అగు శరీరముకలవాడు (రాముడు) |
| శ్రీమత్ పీతమ్ అమ్బరం యస్యసః | శ్రీమత్పీతాంబరః | శోభాయుక్తమయిన పచ్చని వస్త్రము కలవాడు |

ఇంట బహు (మూడు) పదములు సమాసములో చేరియున్నవి. కావున బహుపద బహువ్రీహి సమాసము.

## (3) సంఖ్యోభయపద బహుప్రీహి

ఈ బహుప్రీహిలో పూర్వోత్తరపదములు రెండు సంఖ్యా పదములు అయి యుండును.

| | | |
|---|---|---|
| ద్వౌవా త్రయోవా | ద్విత్రాః | ఇద్దఱు ముగ్గురు |
| పఞ్చవా షడ్వా | పఞ్చషాః | ఐదాఱుగురు |

ద్వి, త్రి శబ్దములు, పఞ్చ, షట్ఛబ్దములు సంఖ్యావాచకములు కావున ఇది సంఖ్యోభయపద బహుప్రీహి.

## (4) సంఖ్యోత్తర పదబహుప్రీహి

| | | |
|---|---|---|
| దశానాంసమీపే యేసన్తితే (పది సమీపమున నున్నవారు) | ఉపదశాః | తొమ్మండ్రు; పదకొండ్రు |

ఇంట ఉపపూర్వపదము సంఖ్యావాచకము కాదు.
దశ అను ఉత్తరపదము సంఖ్యావాచకము
కావున ఇది సంఖ్యోత్తర పదబహుప్రీహి.

## (5) సహ పూర్వపద బహుప్రీహి

ఈ సమాసమున 'సహ' అను అవ్యయము 'కూడ' అను అర్థము కలది. మొదటి పదముగా ఉండును. ఒకప్పుడు 'స' గా నిలచియుండును.

| విగ్రహము | సమాసపదము | అర్థము |
|---|---|---|
| పుత్రేణసహావర్తతే(పితా) | 1 సహపుత్రః<br>2 స పుత్రః | పుత్రునితో కూడి యున్నవాడు(తండ్రి) |
| కలాభిఃసహావర్తే | సకలాః | విద్యలతో కూడినవారు. |

### (6) దిగన్తరాళలక్షణ బహువ్రీహి

దిశోః అన్తరాళమ్ = రెండు దిక్కుల మధ్యభాగము = విదిక్ = మూల.

| | |
|---|---|
| ఉత్తరస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశోః యద్ అన్తరాళమ్ | ఉత్తరపూర్వా = ఈశాన్య మూల |
| దక్షిణస్యాశ్చపూర్వస్యాశ్చ దిశోః యదన్తరాళమ్ | దక్షిణపూర్వా = ఆగ్నేయ మూల |

### (7) వ్యతీహార లక్షణ బహువ్రీహి

వ్యతీహారః = వినిమయః = మార్పిడి.

| | | |
|---|---|---|
| బాహుభిః బాహుభిశ్చ గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తమ్ | బాహూబాహవి | భుజములతో భుజములతో పట్టుకొని జరిగిన యుద్ధము |
| కేశేషు కేశేషు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తమ్ | కేశాకేశి | జుట్టు జుట్టు పట్టుకొని చేసిన యుద్ధము |

తన భుజములను ఎదిరికిచ్చి వాని భుజములను తాను పట్టుకొనుట మార్పిడి (వ్యతీహారము)

### ద్వన్ద్వసమాసము

సమాసములో చేరియున్న రెండు పదములయొక్క అర్థములకు సమ ప్రాధాన్యముండును.

(i) దంపతులను చెప్పునపుడు ఈ సమాసమును తఱచుగా వాడెదరు. "సీతారామౌ", "పార్వతీ పరమేశ్వరౌ", "లక్ష్మీనారాయణౌ" మొదలగునవి ఉదాహరణములు.

(ii) కలిసి తిరుగువారిని చెప్పుటకును ఈ సమాసమును వాడవచ్చును.

ఉ:- కృష్ణార్జునౌ, రామలక్ష్మణౌ మొదలగునవి.

ద్వన్ద్వసమాసము ఇతరేతరయోగ ద్వన్ద్వము, సమాహార ద్వంద్వము అని రెండు విధములు—

### ఇతరేతర యోగద్వంద్వము

| విగ్రహము | సమాసపదము | అర్థము |
|---|---|---|
| రామశ్చకృష్ణశ్చ | రామకృష్ణౌ | రామకృష్ణులు |
| సూర్యశ్చ చన్ద్రమాః చ | సూర్యాచంద్రమసౌ | సూర్యచంద్రులు |
| యుధిష్ఠిరశ్చభీమశ్చఅర్జునశ్చ, | యుధిష్ఠిరభీమార్జునాః | యుధిష్ఠిరభీమార్జునులు. |

రామశ్చ, లక్ష్మణశ్చ, భరతశ్చ, శత్రుఘ్నశ్చ, రామలక్ష్మణభరతశత్రుఘ్నాః = రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు.

### సమాహార ద్వంద్వము

సముదాయము సమాస వాచ్యమగును.

పాణ్యోశ్చ పాదయోశ్చ సమాహారః పాణిపాదమ్ = కాళ్లు చేతులు

ఢక్కా-చమ్మృదఙ్గశ్చ పటహాశ్చ ఏషాంసమాహారః } ఢక్కామృతఙ్గపటహామ్ నగారా, మద్దెల = తప్పెటల సమూహము.

ఆ యా సమాసముల నిరూపించునపుడు

| | |
|---|---|
| అవ్యయీభావము | పూర్వపదార్థ ప్రధానము |
| తత్పురుష | ఉత్తరపదార్థ ప్రధానము |
| ద్వంద్వము | ఉభయపదార్థ ప్రధానము |
| బహువ్రీహి | అన్యపదార్థ ప్రధానము |

అని బహుళోదాహరణములనుబట్టి చెప్పబడినది.

కొన్నికొన్ని ఉదాహరణములు దీనికి భిన్నముగాకూడ కలవు.

| విగ్రహము | సమాసపదము | అర్థము |
|---|---|---|
| 1. మాలామ్ అతిక్రాన్తః = | అతిమాలః; = | మాలను దాటినవాడు. |

ఇది తత్పురుషసమాసము. ఇచట 'అతి' యను పూర్వపదము యొక్క అర్థము ప్రధానముగా నున్నది. ఉత్తర పదార్థము ప్రధానముగా లేదు.

2. దన్తశ్చ ఓష్ఠశ్చ అనయోః సమాహారః దన్తోష్ఠమ్=దన్తోష్ఠముల సముదాయము ఇది సమాహారద్వంద్వము. అన్యపదార్థ ప్రధానముగానున్నది.

3. ద్వౌవా త్రయోవా ద్విత్రాః = ఇద్దఱు ముగ్గుఱు
ఇది సంఖ్యోభయపదబహువ్రీహి - ఉభయపదార్థ ప్రధానము

4. సూపస్య లేశః సూపప్రతి సూపలేశము
ఇది నామ పూర్వపదావ్యయీభావము ఉత్తరపదార్థ ప్రధానము.

కొన్ని సమాసములు పూర్వము నిరూపించిన సమాసములలో చేరినవే యయినను ప్రత్యేకనామములలో పేర్కొనబడు చున్నవి. అలుక్సమాసము, గతిసమాసము, అసమర్థ సమాసము, నిత్యసమాసము మొదలగునవి.

## అలుక్సమాసము

ఈ సమాసమున పూర్వపదము మీది విభక్తి లోపింపక నిలిచియుండును.

1. కంఠే కాలః యస్యసః, కణ్ఠేకాలః, =కంఠమునందు నలుపుకలవాడు
ఇచట కంఠశబ్దముమీది సప్తమీ విభక్తి లోపించలేదు.

2. యుధి స్థిరః యుధిష్ఠిరః=యుద్ధమునందు స్థిరుడు

3. జనుషా అన్ధః జనుషాన్ధః = పుట్టుక చేత, గ్రుడ్డి

తృతీయా విభక్తికి లోపము రాలేదు

కణ్ఠేకాలః - బహువ్రీహి, 'యుధిష్ఠిరః' 'జనుషాన్ధః' తత్పురుషలు.

## గతి సమాసము

సాక్షాత్ కృత్వా సాక్షాత్కృత్య = ప్రత్యక్షము చేసికొని

అలమ్ కృత్వా అలఙ్కృత్య = అలంకరించి

సమాసము వచ్చుటచే 'ల్యప్' ప్రత్యయము వచ్చినది.

## అసమర్థసమాసము

సమసించుపదములయొక్క అర్థములకు అన్వయము ఉండి తీరవలయును. కాని కొన్నిచోట్ల సామర్థ్యములేకపోయినను సమాసము అంగీకరింపబడుచున్నది. ఇదియే అసమర్థసమాసము.

(1) శివే భగవతి భక్తః, = శివభాగవతః, = శివభక్తుడు.

(2) అరీణామ్ షణ్ణామ్‌వర్గః, అరిషడ్వర్గః = క్రామ క్రోధలోభ మోహ మద, మాత్సర్యములు అఱు.

(3) న సూర్యం పశ్యన్తి ఇతి, అసూర్యమ్పశ్యాః, = సూర్యుని చూడనివారు

## నిత్య సమాసము

దీనికి విగ్రహము ఉండదు. ఒకవేళ విగ్రహము చెప్పదల చినచో సమాసములో చేరియున్న పదముయొక్క అర్థము గల మఱియొక పదమును ఉపయోగించి విగ్రహము చెప్పకొనవలసి యుండును.

కుమ్భంకరోతి ఇతి కుమ్భకారః = కుండలుచేయువాడు.

చన్ద్రేణసదృశ్యమ్ చన్ద్రనిభమ్ = చంద్రునితోపోలినది.

నిత్యసమాసమగుటచే 'చన్ద్రేణనిభమ్' అనిప్రయోగించరాదు.

## ప్రాది సమాసము

సు(శోభనః) పురుషః సుపురుషః = మంచివాడు

ప్ర (గతః) ఆచార్యః ప్రాచార్యః = గొప్పఉపాధ్యాయుడు.

ప్రాదులకు క్రియాయోగమునగాని గతిసంజ్ఞ ఉండదు. ఇచట నామయోగమే కావున ప్రాదిసమాసము వేరుగా గ్రహింపబడినది.

## ఏకశేషవృత్తి

ఏకశేషము అనగా ఒక పదము మిగులుట.

| విగ్రహము | ఏకవిశేషము | | అర్థము |
|---|---|---|---|
| మాతాచ పితాచ | పితరౌ | = | తల్లిదండ్రులు |
| శివాచ శివశ్చ | శివౌ | = | పార్వతీపరమేశ్వరులు |
| పుత్రశ్చ దుహితాచ | పుత్రౌ | = | కొడుకు, కూతురు. |
| శ్వశ్రూః చశ్వశురఃచ | శ్వశురౌ | = | అత్తమామలు |

ఇచట 'మాతా' 'శివా' 'దుహితా' 'శ్వశ్రూః' అను పదములు లోపించినవి. మిగిలియున్న 'పితృ' 'శివ' 'పుత్ర' 'శ్వశుర' శబ్దములమీద లోపించిన పదములకు చిహ్నముగా ద్వివచనము వచ్చినది. ఏకశేషవృత్తి సమాసముకాదు, ద్వంద్వమునకు అపవాదము.

## తద్ధితవృత్తి

నామమునకు వచ్చు ప్రత్యయములు 'తద్ధిత'లు.

| విగ్రహము | తద్ధితవృత్తి | | అర్థము | ప్రత్యయము |
|---|---|---|---|---|
| దశరథస్య అపత్యంపుమాన్, | దాశరథిః | = | దశరథునికుమారుడు, | ఇఞ్ |
| జనకస్య (సుతా) | ఇయమ్ జానకీ | = | జనకుని కూతురు, | అణ్ |
| ధర్మంచరతీయఃసః | ధార్మికః | = | ధర్మము నాచరించువాడు, | ఠక్ |

తద్ధిత ప్రత్యయములు వచ్చిన పదము తద్ధిత వృత్తికి ఉదాహరణము.

## కృద్వృత్తి

ధాతువుమీాద వచ్చునట్టి తిఙ్ భిన్నప్రత్యయములకు 'కృత్' సంజ్ఞ.

| విగ్రహము | వృత్తి | అర్థము | ప్రత్యయము |
|---|---|---|---|
| లిఖతిఇతి | లేఖకః | = వ్రాయువాడు | ణ్వుల్ |
| భజన్తేఇతి | భక్తాః | = సేవించువారు | క్త |
| రమన్తేయోగినః అస్మిన్ ఇతి | రామః | = రాముడు | ఘఞ్ |

కృత్ప్రత్యయములు వచ్చిన పదములు కృద్వృత్తికి ఉదాహరణములు.

## సనాద్యన్త ధాతువృత్తి

శ్లో. సన్, క్యచ్, కామ్యచ్, క్యఙ్, క్యషో, ఆచారక్విప్, ణిచ్, యఙౌ, తథా, యక్, ఆయ, ఈయఙ్, ణిఙ్ చేతి ద్వాదశామీాసనాదయః॥

'సన్' మొదలగు ప్రత్యయములు పండ్రెండు.

| ప్రత్యయము | విగ్రహము | వృత్తి |
|---|---|---|
| 1. | జ్ఞాతుమ్ఇచ్ఛతి | జిజ్ఞాసతే = తెలిసికొనగోరుచున్నాడు |
| 2. క్యచ్ (య) ,, | పుత్రమ్ఆత్మనఃఇచ్ఛతి | పుత్రీయతి = పుత్రునికోరుచున్నాడు. |
| 3. కామ్యచ్ (కామ్య),, | ,, | పుత్రకామ్యతి = పుత్రునికోరుచున్నాడు. |

4. క్యఙ్ (య) ఆచారే కృష్ణఇవఆచరతి; కృష్ణాయతే =
కృష్ణునివలె ఆచరించుచున్నాడు

5. క్విప్ (—) ,, కృష్ణఇవఆచరతి; కృష్ణతి =
కృష్ణునివలె ఆచరించుచున్నాడు.

6. క్యష్ (య) భవత్యర్థే అలోహితః లోహితఃభవతి } లోహితాయతే = ఎఱ్ఱనగుచున్నది.

| | | |
|---|---|---|
| 7. ణిచ్ (అయ) ప్రేరణాయామ్ } | స్వార్థే కరోతి, (చేయుచున్నాడు) | ప్రేరణాయామ్, కారయతి (చేయించుచున్నాడు) |

8. యఙ్ (య) భృశమ్
పునఃపునఃఇత్యర్థే భవతి బోభూయతే
(మిక్కిలిమాటిమాటికి)

9. యక్, స్వార్థే కణ్డూయతే (తి)
(=గోకుకొనుచున్నది)

10. ఆయ ,, గోపాయతి

11. ఈయఙ్ ,, =(రక్షించుచున్నాడు)
ఋతీయతే

12. ణిఙ్ (కరణే) శబ్దమ్కరోతి =శబ్దాయతే
(శబ్దముచేయుచున్నాడు)

**ఇంతటితో ఐదువృత్తులు నిరూపింపబడినవి.**

భాషలో గుర్తింపవలసిన కొన్ని స్త్రీప్రత్యయాన్త రూపములను ఇచట చూపుచున్నాము.

| పుంలిఙ్గము | స్త్రీలిఙ్గరూపము |
|---|---|
| కోకిలః | కోకిలా |
| అజః | అజా |
| హంసః | హంసీ |
| రాజా | రాజ్ఞీ |
| నరః | నారీ |
| ఉపాధ్యాయః | ఉపాధ్యాయా (యీ) |
| యువా | యువతిః |
| శ్వశురః | శ్వశ్రూః |
| గౌరః | గౌరీ మొదలగునవి. |

## ప్రశ్నోత్తరములు

| ప్రశ్నవాక్యము | ఉత్తరవాక్యము |
|---|---|

కః = ఎవడు? కా = ఎవతె?

కిమ్ = ఏమి? ఏది?

| | |
|---|---|
| కః అయమ్? = వీడు ఎవ్వడు | అయమ్ బాలః = వీడు బాలుడు<br>అయమ్ రామః = వీడు రాముడు, |
| కా ఇయమ్? = ఈమె ఎవతె? | ఇయమ్ బాలా = ఈమె బాల.<br>ఇయమ్ సీతా = ఈమె సీత. |
| కిమ్ ఇదమ్ = ఇది ఏమి? | ఇదమ్ పుష్పమ్ = ఇది పువ్వు.<br>ఇదమ్ ఫలమ్ = ఇది పండు. |

కౌ = ఎవరు? (ద్వి)

కే = ఎవరు? (బ)

కా యువామ్ ? = మీ రిరువురు ఎవరు ? ఆవామ్ కుశలకా = మేము కుశలవులము.

ఆవామ్ కృష్ణార్జునా = మేము కృష్ణార్జునులము

కే యూయమ్ ? = మీ రెవ్వరు ? వయమ్ బాలాః = మేము బాలురము

వయమ్ విద్యార్థినః = మేము విద్యార్థులము.

## కతి = ఎందఱు : ఎన్ని ?

కతి ఉపాధ్యాయాః, = ఉపాధ్యాయులు ఎందఱు : పఞ్చ ఉపాధ్యాయాః ఐదుగురు ఉపాధ్యాయులు

కతి విద్యార్థినః = విద్యార్థు లెందరు ? వింశతిః విద్యార్థినః ఇరువదిమంది విద్యార్థులు

కతి ఫలాని ? = పండ్లు ఎన్ని ? శతమ్ ఫలాని = నూఱుపండ్లు.

## కుత్ర ? = ఎక్కడ (కు)

కుత్రవర్తతేరామః ? = రాముడు ఎక్కడ ఉన్నాడు ? రామఃగృహేవర్తతే రాముడు గృహమునందున్నాడు

కుత్రగచ్ఛసిత్వమ్ ? = నీవు ఎక్కడకు పోవుచున్నావు ? అహమ్ పాఠశాలాం గచ్ఛామి = నేను బడికి పోవుచున్నాను.

## కదా ? = ఎప్పుడు ?

కదా సూర్యః ప్రకాశతే = దివాసూర్యః ప్రకాశతే

ఎప్పుడు సూర్యుడు ప్రకాశించును ? పగటియందు సూర్యుడు ప్రకాశించును

కదా చంద్రః ప్రకాశతే ? = రాత్రౌ చంద్రః ప్రకాశతే

ఎపుడు చంద్రుడు ప్రకాశించును ? రాత్రియందు చంద్రుడు ప్రకాశించును

## కుతః ? = ఎక్కడనుండి; ఎందువలన ?

కుతః ఆగచ్ఛసి త్వమ్ ? = పాఠశాలాతః ఆగచ్ఛామి (అహమ్)

నీవు ఎక్కడనుండి వచ్చుచున్నావు? బడినుండి వచ్చుచున్నాను

కుతః విలమ్బః జాతః ? = ఖేలనాత్ విలమ్బః జాతః

ఎందువలన ఆలస్యమయినది ? ఆడుకొనుటవలన ఆలస్యము అయినది

## కథమ్ = ఎట్లు ?

కథమ్ ధావతి అశ్వః ? = అశ్వః శీఘ్రం ధావతి

ఎట్లు గుఱ్ఱము పరుగెత్తుచున్నది ? గుఱ్ఱము వడిగా పరుగెత్తుచున్నది

## కియత్ ? = ఎంత ?

కియత్ అస్యపుస్తకస్య మూల్యమ్? అస్యపుస్తకస్యమూల్యంసార్ధరూప్యకమ్
ఈ పుస్తకము వెల ఎంత ? ఈపుస్తకము యొక్క వెల రూపాయిన్నర

## కీదృశ (కథంభూత) = ఎటువంటి

1. కీదృశమ్ పుస్తకమ్ రమ్యమ్ పుస్తకమ్
ఎటువంటి పుస్తకము ? అందమైన పుస్తకము.
2. కథంభూతః రామః శూరః రామః
ఎటువంటి రాముడు ? శూరుడగు రాముడు.

## కిం కరోతి? = ఏమిచేయుచున్నాడు ?

కిం కరోతి బాలః బాలఃపాఠశాలాం గచ్ఛతి
బాలుడు ఏమిచేయుచున్నాడు ? బాలుడు బడికిపోవు
చున్నాడు.

## కిం కృత్వా = ఏమిచేసి

కిం కృత్వా పాఠశాలాంగచ్ఛతి? భుక్త్వాపాఠశాలాంగచ్ఛతి
ఏమిచేసి బడికి పోవుచున్నాడు ? భుజించి బడికిపోవు
చున్నాడు.

## కిమర్థమ్ ? = ఎందులకు ?

కిమర్థమ్ గచ్ఛతి ? అధ్యయనార్థమ్ గచ్ఛతి
ఎందులకు వెళ్లుచున్నాడు? చదువుకొనుటకు వెళ్లుచున్నాడు.

## కింకర్తుమ్? = ఏమిచేయుటకు ?

కింకర్తుమ్ బాలాః ఉత్సహన్తే, బాలాః క్రీడితుమ్ ఉత్సహన్తే
ఏమిచేయుటకు బాలురు ఉత్సాహపడుదురు,
బాలురు ఆడుకొనుటకు ఉత్సహింతురు.

కింకుర్వన్ (కుర్వాణః) = ఏమిచేయుచు?

కింకుర్వన్ గాయతి (హసన్) గచ్ఛన్ గాయతి(పఠతి బాలః)
ఏమిచేయుచు పాడుచున్నాడు (నవ్వుచు)నడచుచు పాడు
చున్నాడు (చదువుచున్నాడు)

కింకుర్వాణః భాషతే పుస్తకం దధానః భాషతే
ఏమిచేయుచు (సి) మాట్లాడుచున్నాడు, పుస్తకము పట్టు
కొని మాట్లాడుచున్నాడు.

* కొన్ని అవ్యయములను వాక్యమునందు వాడుట

సహ = కూడః తృతీయా విభక్తి వచ్చును. (ప్రక్కనఉన్న పదమునకు)
పుత్రేణసహ ఆగతః పితా = తండ్రి పుత్రునితోకూడ వచ్చెను
రామః సీతయాసహవనంగతః = రాముడు సీతతోకూడ వనమునకు
వెళ్ళెను.

వినా = లేకుండ, ద్వితీయ, తృతీయ, పఞ్చమివచ్చును.
విద్యా వినయం (వినయేన వినయాద్వా) వినానశోభతే
= విద్య వినయము లేనిదే రాణించదు.

నమః = నమస్కారము; చతుర్థివచ్చును

1. శివాయనమః
శివునికొఱకు నమస్కారము

2. రామాయనమః
రామునికొఱకు నమస్కారము

3. నమస్తే = నీకు నమస్కారము

ఆ: మొదలుకొని;
వఱకు; పఞ్చమి వచ్చును.

ఆసేతోః ఆహిమాచలాత్
సేతువు మొదలుకొని హిమాచలము వరకు

చేత్ = అయినచో
(ఇనన్)
(చేదర్థకము)

కృష్ణంనమేత్ చేత్ సుఖంయాయాత్
కృష్ణుని నమస్కరించిన (చో) సుఖమును పొందును
(జనుడు)

స్వస్తి = శుభము } చతుర్థి వచ్చును
క్షేమము

స్వస్తి ప్రజాభ్యః = ప్రజలకొఱకు శుభము కలుగుగాక

చ, వా,

(అవ్యయములు)

I చ = సముచ్చయార్థకము

1. రామః ఉద్యానం గచ్ఛతి = రాముడు పూలతోటకు పోవుచున్నాడు.

2. కృష్ణః ఉద్యానం గచ్ఛతి = కృష్ణుడు పూలతోటకు పోవుచున్నాడు.

3. రామశ్చ కృష్ణశ్చ ఉద్యానం గచ్ఛతః = రాముడును, కృష్ణుడును ఉద్యానమునకు పోవుచున్నారు (ద్వివచనము)

4. రామఃకృష్ణః గోవిన్దశ్చఉద్యానంగచ్ఛన్తి (బహువచనము) రాముడును కృష్ణుడును గోవిన్దుడును ఉద్యానమునకు పోవుచున్నారు.

సముచ్చయార్థకమగు 'చ' కారము వాడునపుడు కర్తృ సముదాయ సంఖ్యనుబట్టి క్రియాపదముమీద వచనము వచ్చును.

ప్రతికర్తృ (సముచ్చిత) పదము తరువాత చకారము చేర్చుట తప్పుకాదు. కాని చివర సముచ్చిత పదము తరువాత 'చ' చేర్చిన చాలును.

1. బాలః ఉద్యానం గచ్ఛతి = బాలుడు ఉద్యానమునకు పోవుచున్నాడు.
2. త్వమ్ ఉద్యానం గచ్ఛసి = నీవు ఉద్యానమునకు పోవుచున్నావు.
3. బాలః త్వంచ ఉద్యానం గచ్ఛథః = బాలుడు, నీవును ఉద్యానమునకు పోవుచున్నారు.

ప్రథమ, మధ్యమ పురుష కర్తలున్నపుడు ప్రథమ పురుష కర్తను బట్టి గాక మధ్యమ పురుష కర్తను బట్టి క్రియకు పురుష వచ్చును.

వచనము మొత్తము కర్తృసంఖ్యను బట్టియే వచ్చును.

III

బాలః త్వమ్ అహంచ ఉద్యానం గచ్ఛామః.
బాలుడు నీవు నేనును ఉద్యానమునకు పోవుచున్నాము.

ఇచట ఉత్తమ పురుషకర్త చేరుటచే క్రియాపదమునకు ఉత్తమపురుష వచ్చినది. ప్రథమపురుషకంటె మధ్యమపురుష, మధ్యమ పురుషకంటెగూడ ఉత్తమపురుష ప్రబలము.

వా (వికల్పార్థకము)

రామః గచ్ఛతు. రాముడు పోవుగాక.
కృష్ణః గచ్ఛతు. కృష్ణుడు పోవుగాక.

రామోవా కృష్ణోవా గచ్ఛతు = రాముడుకానీ, కృష్ణుడు కానీ పోవుగాక.

ఇచట ఇరువురు వెళ్ళనవసరము లేదు. పోవువాడు ఒక్కడే కనుక క్రియాపదమున ఏకవచనమే యున్నది.

త్వంవా గచ్ఛ = లేదా నీవు పొమ్ము
అహంవా గచ్ఛాని = కాదా నేను వెళ్ళెదను
రామః కృష్ణః త్వమ్ అహమ్వా గచ్ఛాని
,, ,, అహమ్ త్వమ్వా గచ్ఛ
అహమ్, త్వమ్, రామోవా గచ్ఛతు.

"వా" యోగమున అనేక కర్తలున్నపుడు క్రియకు సన్నిహితమైన కర్తనుబట్టి క్రియకు పురుషవచనము లుండును.

ప్రాథమిక వ్యాకరణము సమాప్తము.

## ఛందస్సు (2)

సంస్కృతమున పద్యవాఙ్మయము అధికము. పద్యమున నాలుగు పాదము లుండును. పాదము అనగా నాల్గవ భాగమే. రెండు పాదములు కలిసి అర్ధము (సగము) అగును. మొదటి రెండు పాదములు పూర్వార్ధము. తరువాత రెండు పాదములు ఉత్తరార్ధము.

### పద్యమున గణనియమము కలదు

వంశస్థవృత్తమున నొక్కొక్క పాదమున జ, త, జ, ర, గణములు క్రమముగా నుండవలయును. 'జతౌతు వంశస్థము దీరితంజరౌ' అని లక్షణము. ఇట్టి నియమములను బోధించు శాస్త్రమే ఛందస్సు.

ఆ గణముల స్వరూపమిచట వివరింపబడుచున్నది.

శ్లో॥ ఆదిమధ్యావసానేషు యరతా యాన్తిలాఘవమ్,
భజసా గౌరవంయాన్తి, మనౌతు గురులాఘవమ్॥

మూడు అక్షరములతో నొక గణ మేర్పడును. ఆ గణములు ఎనిమిది; య, ర, త, భ, జ, స, మ, న, లు అయియున్నవి. గురు లఘువులచేత గణ నిర్ణయము చేయబడినది. కావున ముందు గురు లఘువుల స్వరూపము తెలిసికొన వలసియున్నది.

గురులఘునిర్ణయము :

శ్లో. సానుస్వారో విసర్గాన్తః దీర్ఘో యుక్త పరశ్చయః,
ఏతేతు గురవః ప్రోక్తా, అన్యేతులఘవస్స్మృతాః॥

(1) అనుస్వారము (సున్న) కలది, (2) విసర్గ కలది, (3) దీర్ఘాక్షరము (4) సంయుక్తాక్షరమునకు పూర్వమున (వెనుక) ఉన్నది. ఈ నాలుగు గురువులు. తక్కినవి లఘువులు.

| గణముల లక్షణము | గణము పేరు | ఉదాహరణము |
|---|---|---|
| 1. ఆది లఘువు (తరువాత రెండు గురువులు) | యగణము | గణేశః |
| 2. మధ్య ,, (మొదట చివర గురువులు) | ర ,, | భారతీ |
| 3. అవసాన ,, (మొదట రెండు గురువులు) (చివర) | త ,, | శ్రీరామ! |
| 4. ఆది గురువు (తరువాత రెండు లఘువులు) | భ ,, | మాధవ! |
| 5. మధ్య ,, (మొదట చివర లఘువులు) | రజ ,, | మహేశ! |
| 6. అన్త్య ,, (మొదట రెండు లఘువులు) | స ,, | గిరిజా |
| 7. సర్వగురువు (అన్ని గురువులు) | మ ,, | కౌసల్యా! |
| 8. సర్వలఘువు (మూడక్షరములు లఘువులు) | న ,, | భరత! |

సంస్కృతమున యతి = విరామస్థానము.

ప్రాసనియమము లేదు. వర్ణ మైత్రి శబ్దాలంకారముగా పరిగణింపబడును.

## అలఙ్కారములు (3)

అందము కూర్చునవి అలఙ్కారములు. శబ్దార్థమయమగు కావ్యమున శబ్దమునకు శోభకూర్చునవి శబ్దాలఙ్కారములు. అర్థమునకు శోభకూర్చునవి అర్థాలఙ్కారములు.

ఉపమ ఉత్ప్రేక్ష అతిశయోక్తి అర్థాలంకారములు.
అనుప్రాస యమకము శబ్దాలంకారములు.

### ఉపమ

ఉపమ అనగా సాదృశ్యము, = పోలిక

ఉ 'కోకిల కాకివలె నల్లగా నుండును.'

ఈ వాక్యమున కోకిల కాకితో పోల్చబడనది.

ఏది పోల్చబడినదో అది ఉపమేయము. కోకిల ఉపమేయము. దేనితో పోల్తుమో అది ఉపమానము. కాకి ఉపమానము. నలుపు సాధారణ ధర్మము. 'వలె' యనునది సాదృశ్యమును చెప్పుచున్నది. దీనినిబట్టి ఉపమయున్నచోట నాలుగు అంశములు ఉండును అని తేలినది. (1) ఉపమేయము (2) ఉపమానము (3) సాధారణ ధర్మము (4) సాదృశ్యవాచకము.

ఈ ఉపమ హృద్యముగా (మనోహరముగా) వర్ణింపబడినపుడు ఉపమాలఙ్కారమగును.

### ఉపమాలఙ్కారము

'చంద్రఇవ సున్దరంముఖమ్' అనునది ఉదాహరణము. (ముఖము చంద్రునివలె అందమైనది)

ఇచట ముఖము చంద్రునితో పోల్చబడినది. కన
ముఖము ఉపమేయము. చంద్రుడు ఉపమానము. సౌందర్య
సాధారణధర్మము. ఇవ(వలె,) వాచకము.

## ఉత్ప్రేక్షాలఙ్కారము

ఉత్ప్రేక్ష అనగా ఊహ.

'ఆకాశేనక్షత్రాణి సృష్టిలతాకుసుమానీవ విలసన్తి'

ఉ॥ ఆకసమున నక్షత్రములు సృష్టిలతాకుసుములో
యున్నట్లుండె.

ఇచట చుక్కలు సృష్టిలతాపుష్పములుగా నూహింపబడె
కనుక ఇది ఉత్ప్రేక్షాలంకారము.

## అతిశయోక్త్యలంకారము

కవి తన ప్రతిభచే వర్ణ్యమును అతిశయముగా వర్ణించ
అతిశయోక్తి.

ఉ:- 'సౌధాగ్రాణి పురస్యాస్పృశన్తి విధుమణ్డలమ్'

ఈ పురముయొక్క సౌధశిఖరములు చన్ద్రమణ్డలమ
తాకుచున్నవి. నిజముగా మేడలకొనలు చంద్రమండల
నంటుట లేదు. అయినను మేడలు చాల ఎత్తుగానున్న
చెప్పుటకు కవి యిట్లు వర్ణించినాడు కావున ఇచట అ
యోక్తి.

## శబ్దాలఙ్కారములు

శబ్దములకు శోభకూర్చునవి శబ్దాలంకారము లని
యున్నాము. వర్ణావృత్తివలన శబ్దములకు అందము వచ్చు

### అనుప్రాస

ఒకే వ్యఞ్జనము (హల్లు) అనేక పర్యాయములు మఱల వచ్చిన అనుప్రాసాలఙ్కారము. ఉదాహరణము.

శ్లో॥ యశ్శివోనామ రూపాభ్యాం యాదేవీ సర్వమఙ్గళా,
తయోః సంస్మరణాన్నిత్యం, సర్వతో జయమఙ్గలమ్.

### యమకము

అచ్చులతో కూడిన హల్లులకు, ఆవృత్తి వచ్చిన యమకాలఙ్కారము.

శ్లో॥ శారదా శారదామ్భోజ వదనా వదనామ్బుజే,
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధిస్సన్నిధిం క్రియాత్

ఇతి

శుభమస్తు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి.

వాతప్రమీశబ్దస్య (వాతాభిముఖగామి మృగార్థకస్య) ద్వితీయాసప్తమ్యోః ప్రధీవత్పపీవచ్చరూపమ్.

| | | |
|---|---|---|
| వాతప్రమ్యమ్ / వాతప్రమీమ్ | వాతప్రమ్యౌ | వాతప్రమ్యః / వాతప్రమీన్ |
| వాతప్రమ్యి / వాతప్రమీ | వాతప్రమ్యోః | వాతప్రమీషు |

శేషం ప్రధీశబ్దవత్.

ఈకారాన్తః పుంలిఙ్గ స్సుధీశబ్దః. విద్వాంసుఁడు.

| | | |
|---|---|---|
| సుధీః | సుధియౌ | సుధియః |
| సుధియమ్ | సుధియౌ | సుధియః |
| సుధియా | సుధీభ్యామ్ | సుధీభిః |
| సుధియే | సుధీభ్యామ్ | సుధీభ్యః |
| సుధియః | సుధీభ్యామ్ | సుధీభ్యః |
| సుధియః | సుధియోః | సుధియామ్ |
| సుధియి | సుధియోః | సుధీషు |

ఏవం సుశ్రీః, యవక్రీః ఇత్యాదయః.

నీశబ్ద స్సుధీశబ్దవత్, సప్తమ్యాం విశేషః.

| | | |
|---|---|---|
| నియామ్ | నియోః | నీషు |

ఉకారాన్తః పుంలిఙ్గః క్రోష్టుశబ్దః. నక్క.

| | | |
|---|---|---|
| క్రోష్టా | క్రోష్టారౌ | క్రోష్టారః |
| హే క్రోష్టో | హే క్రోష్టారౌ | హే క్రోష్టారః |
| క్రోష్టారమ్ | క్రోష్టారౌ | క్రోష్టూన్ |